# అథ ద్వావింశో%ధ్యాయ

## జీవుని పుట్టుక

వ్యాస ఉవాచ |

విధిం తాత వదేదానీం జీవజన్మవిధానతః | గర్భే స్థితం చ తస్యాపి వైరాగ్యార్థం మునీశ్వర || 1

వ్యాసుడు ఇట్లు పలికెను-

ఓ తండ్రీ! మహర్షీ! ఇప్పుడు వైరాగ్యము కలుగుట కొరకై జీవుడు జన్మించు విధానమును, జీవుడు గర్భములోనుండే స్థితిని గురించి చెప్పుము (1).

సనత్కుమార ఉవాచ |

శృణు వ్యాస సమాసేన శాస్త్ర సారమశేషతః | వదిష్యామి సువైరాగ్యం ముముక్షోర్భవబంధకృత్ || 2

పాకపాత్రస్య మధ్యే తు పృథగన్నం పృథగ్జలమ్ | అగ్నేరూర్ధ్వం జలం స్థాప్యం తదన్నం చ జలోపరి || 3

జలస్యాధస్స్వ చాగ్నిర్హి స్థితో%గ్నిం ధమతే శ##నైః | వాయునా ధమ్యయానో%గ్నిరత్యుష్ణం కుదుతే జలమ్ || 4

తదన్నముష్ణతోయేన సమంతాత్పచ్యతే పునః | ద్విధా భవతి త్వక్వం పృథక్కిట్టం పృథంగ్రసః || 5

మలైర్ద్వాదశభిః కిట్టం భిన్నం దేహాద్బహిర్భవేత్ | రసస్తు దేహే సరతి స పుష్టస్తేన జాయతే || 6

కర్ణాక్షినాసికా జిహ్వా దంతాశ్శిశ్నో గుదం నఖాః | మలాశ్రయాః కఫః స్వేదో విణ్మూత్రం ద్వాదశ స్మృతాః || 7

హృత్పద్మే ప్రతిబద్ధాశ్చ సర్వానాడ్యస్సమంతతః| జ్ఞేయా రసప్రవాహిన్యస్తత్ప్రకారం బ్రువే మునే || 8

తాసాం ముఖేషు తం సూక్ష్మం ప్రాణః స్థాపయేద్రసమ్ | రసేన తేన నాడీస్తాః ప్రాణః పూరయతే పునః || 9

పునః ప్రయాంతి సంపూర్ణాస్తాశ్చ దేహం సంతతః | తతస్స నాడీమధ్యస్థశ్శరీరేణాత్మనా రసః|| 10

పచ్యతే పచ్యమానాచ్చ భ##వేత్పాకద్వయం పునః| త్వక్ తయా వేష్ట్యతే పూర్వం రుధిరం చ ప్రజాయతే || 11

సనత్కుమారుడు ఇట్లు పలికెను-

ఓ వ్యాసా! శాస్త్రముయొక్క సారము మరియు మోక్షమునకు సంసారబంధమును త్రెంచివేయునది అగుమంచి వైరాగ్యమును గురించి నిశ్శేషముగా సంగ్రహముగా చెప్పగలను. వినుము (2). అన్నమును వండే ప్రక్రియ ఇట్లు ఉండును. వంట గిన్నెలో నీటిని పోసి బియ్యమును పోయవలెను. అప్పుడు నీరు వేరుగా, బియ్యము వేరుగా ఉండును. అపుడా పాత్రను నిప్పులపై పెట్టవలెను. నిప్పుతో నీటికి, నీటితో బియ్యమునకు సంయోగము గలదు (3). నీటికి క్రింద ఉన్న అగ్నిని వాయువు నెమ్మదిగా ప్రజ్వరిల్లజేయును. వాయువుచే ప్రజ్వరిల్ల చేయబడిన అగ్ని నీటిని మరుగునట్లు చేయును (4). ఆ వేడి నీరు బియ్యమునుపూర్తిగా ఉడుకునట్లు చేయును. ఆ ఉడికిన బియ్యము రెండు భాగములుగా విడిపోవును. ఒక భాగము పైకి తేలే మాలిన్యము కాగా, రెండవ భాగము అన్నరసము (గంజి) (5). అదే విధముగా, మనముతినే ఆహారము శరీరములో విడిపోయి, పన్నెండు మాలిన్యములు విసర్జింపబడును. కాని, అన్నరసము దేహమునందు ప్రసరించి శరీరమురకు పుష్టిని చేకూర్చును (6). చెవులు, కన్నులు, ముక్కు, నాలుక, దంతములు, జననేంద్రియము, విసర్జనేంద్రియము, గోళ్లు అనునవి మాలిన్యస్థానములు. కఫము, చెమట మరియు మలమూత్రములతో కలసి ఈ మాలిన్యము పన్నెండు రకములుగా నున్నది (7). ఓ మహర్షీ! నాడులన్నియు అన్ని వైపులనుండియు హృదయపద్మమునకు కలుపబడి యున్నవి. అవి రసమునుప్రవహింపజేయునని తెలియదగును. ఓ మునీ! ఆ విధానమును చెప్పెదను (8). ప్రాణశక్తి ఆ సూక్ష్మమగు

రసమునునాడుల ముఖస్థానములయందు స్థాపించును. ఇంతేగాక, ప్రాణశక్తిఆ నాడులను ఆ రసముతో నింపును (9). ఆ విధముగా రసపూర్ణములైన నాడులు దేహము అంతటా ప్రసరించును. తరువాత ఆ నాడుల మధ్యలోనున్న రసమును శరీరము జీర్ణము చేసుకొని తనలో కలుపుకొనును. ఈ పచనము రెండు రకములుగా సాగును. ముందుగా శరీరము చుట్టూ చర్మము నిర్మాణమై, తరువాత రక్తము పుట్టును (10, 11)..

రక్తాల్లోమాని మాంసం చ కేశాస్నాయుశ్చ మాంసతః |
స్నాయుతశ్చ తథాస్థీని నఖా మజ్జాస్థిసంభవాః || 12

మజ్జాకారణవైకల్యం శుక్రం హి ప్రసవాత్మకమ్ | ఇతి
ద్వాదశధాన్నస్య పరిణామాః ప్రకీర్తితాః || 13

శుక్రో%న్నాజ్జాయతే శుక్రాద్ధివ్యదేహస్య సంభవః || ఋతుకాలే యదా
శుక్రం నిర్దోషం యోనిసంస్థితమ్ || 14

తద్వా తద్వాయుసంస్పృష్టం స్త్రీ రక్తైనైకతాం వ్రజేత్ | విసర్గకాలే
శుక్రస్య జీవఃకారణసంయుతః || 15

సంవృతః ప్రవిశేద్యోనిం కర్మభిస్తై#్స్వైర్నియోజితః |
తచ్ఛుక్రరక్తమేకస్థమేకాహాత్కలిలం భ##వేత్ || 16

పంచరాత్రేణ కలిలం బుద్బుదాకారతాం వ్రజేత్ |
బుద్బుదస్సప్తరాత్రేణ మాంసపేశీ భ##వేత్పునః || 17

గ్రీవా శిరశ్చ స్కంధౌ చ పృష్ఠవంశస్తథోదరమ్ | పాణిపాదం తథా
పార్శ్వే కటిర్గాత్రం తథైవ చ || 18

ద్విమాసాభ్యంతరేణైవ క్రమశస్సంభ##వేదిహ | త్రిభిర్మాసైః
ప్రజాయంతే సర్వే హ్యంకురసంధయః || 19

మాసైశ్చతుర్భిరంగుల్యః ప్రజాయంతే యథా క్రమమ్ | ముఖం
నాసా చ కర్ణౌ మాసైః పంచభిరేవ చ|| 20

దంతపంక్తిస్తథా గుహ్యం జాయంతే చ నఖాః పునః | కర్ణయోస్తు భ##వేచ్ఛిద్రం షణ్మాసాభ్యంతరేణ తు || 21

రక్తము నుండి రోమములు, మాంసము పుట్టును, మాంసమునుండి శిరస్సుపై కేశములు మరియు కండరములు పుట్టును. కండరముల నుండి ఎముకలు, ఎముకల నుండి గోళ్లు మరియు ఎముకల మధ్యనుండే మజ్జ పుట్టును (12). ఈ మజ్జ పరిణామమును చెంది శుక్రమునకు కారణమగును, శుక్రము సంతానహేతువు. ఈ తీరున అన్నము పన్నెండు రూపములలోనికి పరిణమించుచున్నది (13). అన్నమునుండి శుక్రము పుట్టుచున్నది. శుక్రమునుండి మరియొక చేతనదేహము పుట్టును. ఋతు (మాసికరజోదోషనియమములను పాటించుట పూర్తి అయిన ) కాలమునందుదోషరహితమైన శుక్రము స్త్రీ యోనియందు నిక్షిప్తమై అచటి ప్రాణశక్తితో కూడి స్త్రీ రక్తముతో ఐక్యమును చెందును. జీవుడు సూక్ష్మశరీరముతో కూడినవాడై అజ్ఞానముచే కప్పివేయబడినవాడై తన పూర్వకర్మల ప్రభావముచే నియంత్రింపబడి శుక్రమును నిక్షేపించు కాలములో స్త్రీ గర్భమును ప్రవేశించును. ఆ శుక్రరక్తసముదాయము గర్భాశయము అనే ఎకస్థానమునందు కలుసుకొని ఒక రోజు సమయములో పిండరూపమును ధరించును (14-16). ఐదు రోజులలో ఆ పిండము బుడగ ఆకారమునుదాల్చును. ఆ బుడగ ఏడు రోజులలో మాంసపు ముద్దయగును (17). ఆ ముద్దయందు రెండు మాసముల లోపులో మెడ, తల, భుజములు, వెన్నెముక, పొట్ట, చేతులు, కాళ్లు, పార్శ్వభాగములు, నడుము, మరియు పూర్ణ శరీరసంస్థానము నిర్మాణమగును. మూడు మాసములలో కీళ్లు అన్నియు నిర్మాణమగును (18,19). నాలుగు మాసములలో వ్రేళ్లు,అయిదు మాసములలో క్రమముగా నోరు, ముక్కు, చెవులు ఏర్పడును (20). ఆరు మాసముల లోపులో పళ్ల వరుస, జననేంద్రియము, గోళ్లు, మరియు చెవుల లోపలి రంధ్రము ఏర్పడును (21).

పాయుర్మేహయుపస్థం చ నాభిశ్చా భ్యుపజాయతే | సంధయో యే చ గాత్రేషు మాసైర్జాయంతి సప్తభిః || 22

అంగప్రత్యంగసంపూర్ణః పరిపక్వస్స తిష్ఠతి | ఉదరే
మాతురాచ్ఛన్నో జరా¸° మునిసత్తమ || 23

మాతురాహారచౌర్యేణ షడ్విధేన రసేన తు | నాభినాలనిబద్ధేన
వర్ధతే స దినే దినే || 24

తతః స్మృతిం లభేజ్జీవస్సంపూర్ణో%స్మిన్ శరీరకే | సుఖం దుఃఖం
విజానాతి నిద్రాస్వప్నం పురాకృతమ్ || 25

మృతశ్చహం పునర్జాతో జాతశ్చాహం పునర్మృతః |
నానాయోనిసహస్రాణి మయా దృష్టాని జాయతా || 26

అధునా జాతమాత్రో%హం ప్రాప్తసంస్కార ఏవ చ | శ్రయో%మునా
కరిష్యామి యేన గర్భే న సంభవః|| 27

గర్భస్థశ్చింతయత్యేవమహం గర్భాద్వినస్సృతః | అన్వేష్యామి
శివజ్ఞానం సంసారవనివర్తకమ్ || 28

ఏవం స గర్భదుఃఖేన మహతా పరిపీడితః | జీవః కర్మవశాదాస్తే
మోక్షోపాయం విచింతయన్ || 29

యథా గిరివరాక్రాంతః కశ్చిద్దుఃఖేన తిష్టతి | తథా జరాయుణా దేహీ
దుఃఖం తిష్టతి వేష్ఠితః || 30

పతతస్సాగరే యద్వద్దుఃఖమాస్తే సమాకులః | గర్భోదకేన
సిక్తాంగస్సర్వదాకులితస్తదా || 31

ఏడు మాసములలో విసర్జనేంద్రియము, మూత్రాశయము, జననేంద్రియము,అపుడు నాభి యరియు శరీరావయవములయంది కీళ్లు నిర్మాణమగును (22). ఓ మహర్షీ! అప్పుడు సర్వావయవములయందు పరిపూర్ణుడై పూర్తిగా ఎదిగియున్న ఆ శిశువు తల్లియొక్క కడుపులో జరాయువు (పిండమును చుట్టి యుండు పొర) నందు కప్పబడి యుండును (23). ఆ శిశువు తల్లియొక్క ఆరు రసములతో కూడియున్న ఆహారమును నాభినాళము ద్వారా స్వీకరించుచూ దిన దినప్రవర్ధమానుడగుచుండును (24). అపుడు ఆ శరీరము

పూర్ణముగా నిర్మాణమై యుండగా ఆ జీవుడు స్మృతిని పొందిసుఖదుఃఖములను మరియు పూర్వ జన్మలో తను చేసిన కర్మలను నిద్రపోతూ కన్న కలను వలె స్మరించును (25). నేను మరణించి మరల జన్మించినాను; జన్మించి మరల మరణించినాను. ఈ విధముగాపుడుతూ ఉండే నేను అనేకవేల జన్మలను చూచితిని (26). ఈ జన్మలోనేనుపుట్టి సంస్కారములను పొందిన వెంటనే ఈ దేహముతో మోక్షము లభించి మరల జన్మ లేని విధముగా ప్రయత్నించెదను (27). నేను గర్భమునుండి బయట పడగానే, సంసారమునుండి విముక్తిని కలిగించే శివజ్ఞానమును అన్వేషించెదను అని గర్భమునందలి జీవుడు తలపోయుచుండును (28). ఈ విధముగా ఆ జీవుడు కర్మకు లోబడి గర్భవాసముయొక్క మహాదుఃఖమును అనుభవించుచూ మోక్షోపాయమును గురించి ఆలోచించుచుండును (29). జరాయువుచే కప్పబడియున్న జీవుడు పెద్ద పర్వతము మీద పడినదా యన్నట్లు భారముచే క్రుంగిపోవుచూ మహాదుఃఖమునను భవించును (30). ఆ సమయములో సర్వకాలములలో గర్భమునందలి నీటిలో మునిగి యున్న జీవుడు సముద్రమునందు పడియున్న మానవుని వలె కంగారు పడుతూ మహాదుఃఖమును అనుభవించును (31).

లోహకుంభే యథా న్యస్తః పచ్యతే కశ్చిదగ్నినా | గర్భకుంభే తథా క్షిప్తః పచ్యతే జఠరాగిగ్నినా || 32

సూచీభిరగ్నివర్ణాభిర్నిర్భిన్నస్య నిరంతరమ్ | యద్దుఃఖం జాయతే తస్య తత్ర సంస్థస్య చాధికమ్ || 33

గర్భావాసాత్పరం దుఃఖం కష్టం నైవాస్తి కుత్రచిత్ | దేహినాం దుఃఖబహులం సుఘోరమతిసంకటమ్ || 34

ఇత్యుతత్సుమహాద్దుఃఖం పాపినాం పరికీర్తితమ్ | కేవలం ధర్మముద్ధీనాం సప్తమాసైర్భవస్సదా || 35

గర్భాత్సుదుర్లభం దుఃఖం యోనియంత్రనిపీడనాత్ | భ##వేత్సాపాత్మనాం వ్యాస న హి ధర్మయుతాత్మనామ్ || 36

ఇక్షువత్పీడ్యమానస్య యంత్రేణైవ సమంతతః | శిరసా తాడ్యమానస్య పాపముద్గరకేణ చ || 37

యంత్రేణ పీడితా యద్వన్నిస్సారాస్స్యుస్తిలాః క్షణాత్ | తథా శరీరం నిస్సారం యోనియంత్రనిపీడనాత్ || 38

అస్థిపాదతులాస్తంభం స్నాయుబంధేన యంత్రితమ్ | రక్తమాంసమృదాలిప్తం విణ్మూత్రద్రవ్యభాజనమ్ || 39

కేశరోమనఖచ్ఛన్నం రోగాయతనమాతురమ్ | వదనైకమహాద్వారం గవాక్షాష్టకభూషితమ్ || 40

ఓష్ఠద్వయకపాటం చ తథా జిహ్వార్గలాన్వితమ్ | భోగతృష్ణాతురం మూఢం రాగద్వేషవశానుగమ్ || 41

నిప్పులపై కాలుచున్న పాత్రలోని మరుగుచున్న నీటిలో పారవేయబడిన జీవుడు ఏ తీరున దహించివేయబడునో, అదే విధముగా గర్భము అనే పాత్రలో పారవేయబడియున్న జీవుడు జఠరాగ్నిచే తపింపచేయబడును (32). నిప్పులవలె కణకణలాడే సూదులతో నిరంతరముగా పొడవబడినప్పుడు ఎట్టి దుఃఖము కలుగునో, గర్భమునందలి జీవునకు అంతకంటే అధికమగు దుఃఖము కలుగును (33). ప్రాణులకు అతిశయించిన దుఃఖమును కలిగించునది, మిక్కిలి ఘోరమైనది, తప్పించుకొన శక్యము కానిది అగు గర్భవాసము కంటే పెద్ద దుఃఖము మరియు క్లేశము ఈ జగత్తులో ఎక్కడైననూ లేనే లేదు (34). ఈ మహాదుఃఖము పాపాత్ములకు మాత్రమే కలుగునని చెప్పబడినది. కాని ధర్మాత్ములగు జీవులు నిశ్చయముగా ఏడు మాసములలో జన్మించెదరు. (35). ఓ వ్యాసా! జన్మించునప్పుడు జీవునకు కలిగే దఃఖము కలుగదు గర్భవాసదుఃఖము కంటే అధికము. ఈ దుఃఖము పాపాత్ములకు మాత్రమే కలుగును. ధర్మబుద్ధి గలవారికి ఈ దుఃఖము కలుగదు (36). పాపియగు జీవుడు జన్మసమయములో యంత్రములో నలగకొట్టబడే చెరుకుగడవలె పాపము అనే రోకలి తలపై మోదుచున్నదా యన్నట్లు పీడను పొందును (37). యంత్రములో నలగకొట్టబడిన నువ్వులు

క్షణకాలములో పిప్పి యగును. అదే విధముగా జన్మసమయములో కలిగే పీడ వలన జీవుని దేహము నిస్సారమగును (38). ఈ శరీరము వ్రేలాడే స్తంభములు వలెనున్న ఎముకలు మరియు పాదములు గలది, కండరములచే బంధింపబడి నియంత్రించబడునది, రక్తముచే మరియు అశుచియగు మాంసముచే పూయబడియున్నది. మలమూత్రములవంటి పదార్థములకు నిలయమైనది (39). కేశములు, రోమములు, గోళ్లు అనువాటితో ఆవరించ బడియున్నది, రోగములకు నిలయమైనది, దుఃఖమునకు ఆలవాలమైనది, నోరు అనే పెద్ద ద్వారము గలది, ఎనిమిది (నవరంధ్రములలో నోరు మినహాయించి మిగిలినవి) కిటికీలతో అలంకరింపబడియున్నది (40). రెండు పెదవులు అనే తలుపులు గలది, నాలుక అనే గడియ గలది, భోగములయందలి తృష్ణచే పీడింపబడునది, మోహమునకు నిలయమైనది మరియు రాగద్వేషములకు వశ##మై చరించునది (41).

సంవర్తితాంగప్రత్యంగం జచాయుపరివేష్టితమ్ | సంకటే నావివిక్తేన యోనిమార్గేణ నిర్గతమ్ || 42

విణ్మూత్రరక్తసిక్తాంగం వికోశికసముద్భవమ్ | అస్థిపంజరవిఖ్యాతమస్మిన్ జ్ఞేయం కలేవరమ్ || 43

శతత్రయం షష్ట్యధికం పంచపేశీశతాని చ | సార్ధాభిస్తిసృభిశ్ఛన్నం సమంత్రాద్రోమకోటిభిః || 44

శరీరం స్థూలసూక్ష్మాభిర్దృశ్యా%దృశ్యా హి తాస్స్మృతాః | ఏతావతీభిర్నాడీభిః కోటిభిస్తత్సమంతతః || 45

అస్వేదమధుభిర్యాభిరంతస్థః స్రవతే బహిః | ద్వాత్రింశదశనాః ప్రోక్తా వింశతిశ్చ కపిలస్య చ || 46

పిత్తస్య కుడవం జ్ఞేయం కఫస్యాథాఢకం స్మృతమ్ | వసాయాశ్చ పలం వింశత్తదర్ధం కపిలస్య చ || 47

పంచార్ధం తు తులా జ్ఞేయా పలాని దశ మేదసః | పలత్రయం మహారక్తం మజ్జాయాశ్చ చతుర్గుణమ్ || 48

శుక్రోర్ధం కుడవం జ్ఞేయం తద్బీజం దేహినాం బలమ్ |
మాంసస్యచైకపిండేన పలసాహస్రముచ్యతే || 49

రక్తం పలశతం జ్ఞేయం విణ్మూత్రం యత్ప్రమాణతః |
అంజలయశ్చ చత్వారశ్చత్వారో మునిసత్తమ || 50

ఇతి దేహగృహం హ్యేతన్నిత్యస్యానిత్యమాత్మనః | అవిశుద్ధం
విశుద్ధస్య కర్మబంధాద్వినిర్మితమ్ || 51

ఇతి శ్రీశివమహాపురాణ ఉమాసంహితాయాం దేహోత్పత్తి వర్ణనం
నామ ద్వావింశో%ధ్యాయః (22)

తల్లి గర్భములో జరాయువు అను చర్మముచే కప్పబడియున్న జీవుడు జన్మించే సమయములో ఒక దానితో నొకటి చిక్కుకొనియున్న అవయవములు గలవాడై, ఇరుకైన మార్గముగుండా అతికష్టము మీద బయట పడును (42). ఈ సమయములో ఒర (బంధస్థానము) నుండి బయట పడి అస్థిపంజరము వలెనున్న ఆ దేహము మలమూత్రములతో మరియు రక్తముతో తడిసి యుండును (43). మూడు వందల అరువది ఎముకలతో మరియ అయిదు వందల కండరములతో కూడియున్న ఆ దేహము మూడున్నర కోట్ల రోమములతో కప్పబడియుండును (44). ఆ దేహములో అంతటా అదే సంఖ్యలో నాడులు వ్యాపించియుండును. ఈ నాడులలో కొన్ని స్థూలముగా నుండుటచే కంటికి కానవచ్చిననూ, మరికొన్ని సూక్ష్మములగు నాడులు కంటికి కానరావు (45). దేహము లోపల స్రవించే మాలిన్యములు ఈ రోమకూపములగుండా చెమట రూపములో బయటకు వచ్చును. ఆ దేహమునకు ముప్పది రెండు పళ్లు. ఇరువది గోళ్లు ఏర్పడును (46). దేహములో పిత్తముయొక్క పరిమాణము ఒక కుడవము (12 దోసిళ్లు) అనియు, కఫముయొక్క పరిమాణము అఢకము (శేరు) అనియు, వస (మాంసములోని క్రొవ్వు) యొక్క పరిమాణము ఇరువది పలములనియు, కుంకుమ రంగు గల ఘనపదార్థము దానిలో సగమనియు చెప్పబడినది (47). క్రొవ్వు పదార్థము యొక్క పరిమాణము పదిహేనున్నర పలములు ఉండును. శుద్ధరక్తము మూడు పలములు ఉండును ఇది

ఎముకలోని ములుగుకు నాలుగు రెట్లు (48). శుక్రము అర్ధకుడవము (ఆరు దోసిళ్లు) ఉండును ప్రాణుల దేహశక్తి మరియు ప్రజనన సామర్ధ్యము దానిపై ఆధారపడి యుండును. ఒక దేహములోని మాంస పిండము వేయి పలముల పరిమాణము కలిగియుండును (49). ఓ మహర్షీ! రక్తము యొక్క పరిమాణము వంద పలములు అనియు, మలమూత్రములు నాలుగు నాలుగు గుప్పిళ్ల పరిమాణములో నుండుననియు తెలియవలెను (50). ఈ అనిత్యమగు దేహము అనే గృహమునందు నిత్యమగు ఆత్మ నివసించును. విశుద్ధమగు ఆత్మకు కర్మబంధము వలన ఈ అశుచియగు దేహము నిర్మితమైనది (41).

శ్రీ శివమహాపురాణములో ఉమాసంహితయందు జీవుని పుట్టుకను వర్ణించే ఇరువదిరెండవ అధ్యాయము ముగిసినది (22).